पत्नीसुतधनैः सम्यक् बद्धो मर्त्यो विनश्यति ।
स्वसृष्टतन्तुबद्धः सन्नूर्णनाभो यथा स्वयम् ॥ 61

उष्णीषकुण्डलक्षौममण्डितो याचकः प्रभुम् ।
पशुप्रायं दानशून्यमज्ञात्वा सेवते वृथा ॥ 62

जननीसुतयोर्वित्तं विरोधं जनयेदिति ।
वदन्ति, किन्तु संसारः कथं स्यात् धनमन्तरा ॥ 63

सर्वोऽपि कुरुते सद्यः श्रुत्वा धनिकवाञ्छितम् ।
दरिद्रं तत इत्युक्त्वा ब्रूयान्नास्तीति चान्ततः ॥ 64

तुषार्थं गच्छतोऽन्यत्र तण्डुलः स्यात् श्वभक्षितः ।
अरक्षितं वैश्यधनं तथा नीचवशं भवेत् ॥ 65

अभोजयन्नभुञ्जानो वित्तं व्यर्थं करोति यः ।
स सस्यभूमौ दृष्टयर्थं बद्धः कृत्रिममानुषः ॥ 66

स्वदेशं क्षामभूयिष्ठं त्यक्त्वा देशान्तरं व्रजेत् ।
बकः शुष्कं सरस्त्यक्त्वा यथान्यद् याति वै सरः ॥ 67

भिक्षया प्राप्तमित्युक्त्वा न दद्यात् स्वेच्छया धनम् ।
भिक्षालब्धं धनं चापि दत्तं सन्नश्यति ध्रुवम् ॥ 68

मधुरान्मधुराः प्राणाः स्वर्णं स्यान्मधुरं ततः ।
ततोऽपि मधुरं लोके स्त्रीणां मधुरभाषितम् ॥ 69

रोगार्तः तस्य शान्त्यर्थं भक्तिमान् जायते नरः ।
निर्धनो ब्रह्मचारी स्यात् मल्लः स्यात्तु निरायुधः ॥ 70

अपूपार्थं तुषार्थं वा शाकार्थं कवयो भुवि ।
कुर्वन्ति काव्यरत्नानि धनार्जनपरायणाः ॥ 71

वदेदुच्चदशावन्तं बन्धुमन्यमनादरात् ।
पश्येत् ; एका धनदशा श्रेष्ठा सर्वदशास्वपि ॥ 72

धनाधिक्यं दशामाहुः निद्राहारौ विना हि तत् ।
रक्षणीयं, व्यये चाये स्थितौ दुःखकरं धनम् ॥ 73

जना दानमकृत्वैव स्थापयन्ति धनं भुवि ।
तथा सत्यन्ततस्तेषां नश्येन्मूलधनं वृथा ॥ 74

वारत्रयं दिने भुक्त्वा सुप्त्वा सङ्गम्य चाङ्गनाः ।
दुःसाङ्गत्याद्वृथा लोके हा कुर्वन्ति धनव्ययम् ॥ 75

भुक्त्यर्थं देशसञ्चारो वृत्त्यर्थं वेषधारणम् ।
किमर्थं; हृदि सद्वाक्यं निधेहि ममतां त्यज ॥ 76

देशाटनेन वेषेण हरिर्द्रष्टुं न शक्यते ।
स चास्ति चित्ते; भुक्त्यर्थं सर्वो वेषो वृथा ततः ॥ 77

वेदबाह्यो दोषकारी दुष्टो वा शत्रुरेव वा ।
धनिकश्चेत् सदा लोके तोष्यते सेव्यते जनैः ॥ 78

चौर्येण द्रोहबुद्ध्या वा साहसेन श्रमेण वा ।
धनं धनिकवर्येभ्यः सदा सम्पादयेन्नरः ॥ 79

धैर्यं विना धनं न स्यात् न धैर्यं धनमन्तरा ।
धनं धैर्यं द्वयं लोके नृणां मुख्यं भविष्यति ॥ 80

धनाभावे गुणो नश्येत् कीर्तिश्चापि विनश्यति ।
धनाभावे शुचित्वं च न भवेद् भूतेल नृणाम् ॥ 81

पुण्याद्दरिद्रदम्पत्योः जनित्वा भाग्यवान् सुतः ।
सम्पाद्य बहुलं वित्तं कुरुते लोकमङ्गलम् ॥ 82

धनाभावो दाववह्निसदृशः स्वाश्रितैः सह ।
स्मर्तारं नाशयेत्, तस्मात् पापं दारिद्र्यचिन्तनम् ॥ 83

पुत्रा अपि विनिन्दन्ति दरिद्रम, गृहिणी पतिम् ।
दरिद्रं न स्पृशेत्, को वा दारिद्र्यं सहते भुवि ॥ 84

धनं हि जगतो हेतुः धनं सर्वस्य कारणम् ।
गुणो हि सम्पदो हेतुः चित्तं स्यान्मुक्तिकारणम् ॥ 85

श्वनिन्दकः स्वयं बध्वा तस्मै चान्नं प्रयच्छति ।
अन्विष्यति तथा वित्तं निन्दन्नेव धनं खलः ॥ 86

आत्मनोऽप्युत्तमं स्तौति वक्ति नारायणेति च ।
अथापि ग्रन्थिमुन्मुच्य धनं किञ्चिन्न यच्छति ॥ 87

निर्धनं नेक्षते बन्धुः निर्धनस्य परं पदम् ।
न जायते; निर्धनस्य ऋणं वापि न लभ्यते ॥ 88

उष्णीषकुण्डलक्षौमैः अङ्गुलीयमहोदरैः ।
भूषितस्य नरस्यैव सर्वे तिष्ठन्ति बान्धवाः ॥ 89

पापपुण्ये यथा योगी वेत्ति, नो वेत्ति पामरः ।
ज्ञातस्वर्णार्जनोपायः तथा त्वं धनमार्जय ॥ 90

क्षीराब्धिशयनो विष्णुः क्षीरार्थं गोकुलं ययौ ।
परवस्तुनि सर्वेषां रुचिः सञ्जायते किल ॥ 91

व्रणबाधा धनाढ्यस्य जायते लोकविश्रुता ।
को जानाति विवाहं वा दरिद्रसदने कृतम् ॥ 92

पूर्वपुण्यं विना लोके नृणां वित्तं न लभ्यते ।
बीजावापं विना सस्यं छेत्तुं लभ्येत किं नृणाम् ॥ 93

कुण्डलेनाङ्गवस्त्रेण कायपुष्ट्या च विद्यया ।
युक्तश्चेदकुलीनोऽपि महानिति स गण्यते॥ 94

अहो दुःखं दरिद्रस्य न कश्चिद्गणयेन्नरः ।
दु खिते धनिके खेदमसह्य इति भाषते ॥ 95

प्राप्तव्यं तु फलं यत्र तत्र तल्लभते नरः ।
देवोऽपि प्राप्तिहीनस्य कथं दद्याद्धनं भुवि ॥ 96

बलं तदेव नारीणां यद्भर्ता बहुभाग्यवान् ।
व्यर्थो हि निर्धनो भर्ता तं भार्यापि न पश्यति ॥ 97

धनिकेन कृतं सर्वं सफलं जायते भुवि ।
दरिद्रेणं कृतं सर्वं व्यर्थं सन्न फलप्रदम् ॥ 98

---

॥ इति अर्थपद्धतिः सम्पूर्णा ॥

శ్రీ ర స్తు

# వేమన పద్యములు

## మూర్ఖపద్ధతి

క. అజ్ఞానమె శూద్రత్వము
సుజ్ఞానము బ్రహ్మమాట శ్రుతులను వినరా
అజ్ఞాన మణంచి వాల్మికి
సుజ్ఞానపు బ్రహ్మ మొందెఁ జూడర వేమా. 1

ఆ. అడవియడవి దిరిగి యాసను విడలేక
గాసిపడెడువాఁడు ఘనుఁడు గాఁడు
గోసిగోసి మదిని రూఢిగా నిలిపిన
వాఁడె పరముగన్నవాఁడు వేమ. 2

ఆ. అదిమి మనసు నిలిపి యానందకేళిలో
బ్రహ్మమయుఁడు ముక్తిఁ బడయఁ గోరు
జిహ్వారుచులచేత జీవుండు చెడునయా
విశ్వదాభిరామ వినుర వేమ. 3

తే. అరయ సుఖ మొంది దుఃఖమ్ము నార్పలేక
విధిని దూఱంగ ఫల మేమి వేడుకలర
బుద్ధినొక్కినఁ బరిపూర్తిఁ బొందునయ్య
అట్లుకా కూరకయె యుండనగునె వేమ. 4

ఆ. అనువుగానిచోటఁ బనికొని జూదము
నాడి కూడి యోడి యడవిసొచ్చు
ఘనునిజూచిఁ జూచిగడువుము మూర్ఖత. వి. 5

ఆ. అలయఁ జేసి మలఁచి యడిగండ్లు మలిగండ్లు
తిరిపెమిడెడు కటిక దేబెలెల్ల
నెలమిమన్నదినెడు నెట్టిలోదురుసుమీ, వి. 6

ఆ. అవులఁ గా మెఱుఁగక యజ్ఞానజీవులు
మూలమును దెలియక ముట్టుచేత
ననుదినము సృజింతు రాత్మఁ దెలియలేక, విశ్వ. 7

ఆ. ఆత్మ నెఱుఁగనినుతి యట్టిట్టుచేసిన
వానిమెచ్చువాఁడు వట్టివాఁడె
ముక్కిడిదయుఁ బోడ మొండియు మెచ్చఁడా, వి. 8

ఆ. ఆభిజాత్యమున నె యాయువున్నంతకుఁ
దిరుగుచుండ్రు భ్రమలఁ దెలియలేక
మురికిభాండమునను ముసరు నీఁగలకీతి, వి. 9

ఆ. ఆలిమాటలు విని యన్నదమ్ములఁ రోసి
వేఱుపడుచునుండు వెట్టిజనుఁడు
కుక్కతోఁకఁ బట్టి గోదావరీఁదును, వి. 10

ఆ. ఆసనం బెఱుఁగక యానామకర్మంబు
గురువుచేతఁ దెలిసి కూర్చుకున్న
మనసు నిలుపకున్న మఱి ద్విజుండెట్లగు, వి. 11

ఆ. ఇట్టు ఘటములోనఁ బెట్టిన జీవుని
గానలేక నరుఁడు కాశికేఁగి
వెదకి వెదకి యతఁడు వెట్టియై పోవును, వి. 12

ఆ. ఇంటియాలి విడిచి యిలజారకాంతల
వెంట తిరుగువాఁడు వెఱ్ఱివాఁడు
పంటచేను విడిచి పరిగ యేఱినయట్లు, వి. 13

ఆ. ఇంద్రియములచేత నెగ్గొందుచుండెడు
వెఱ్ఱిమనుజుఁడెల్ల వెదకు శివుని
ఇంద్రియములగోసి యీశునిఁజూడరా, విశ్వ, 14

ఆ. ఇన్ని జాతులందు నేజాతిముఖ్య మఱ
ఎఱుకగల్గువారె యెచ్చువారు
ఎఱుకలేనివార లేజాతి నున్నను
హీనజాతియంచు నెఱుఁగు వేమ. 15

ఆ. ఇహమునందుఁబుట్టి యింగితమెఱుఁగని
జనుల నెంచి చూడ స్థావరములు,
జంగమాదు లనుట జగతినిఁ బాపము, విశ్వ. 16

ఆ. ఈతగింజవంటి దెఱిఁగియు దానికే
యాసపడును మూర్ఖుఁ డవనిలోనఁ
దోయజాక్షిఁ జూచి తొలఁగంగవశమానె? విశ్వ. 17

ఆ. ఉత్తతిత్తి దీనియుపయోగములు లేవు
తిత్తికొఱకుఁ జెడును దేవులాడి
కత్తిమీఁదిసాము కడతేరఁబోదయా, విశ్వ. 18

ఆ. ఉన్నదానిని గను మూపిరి బిగఁబట్టి
కన్ను మూసి యేమి కాన లేవు
విన్నదన్న దెఱుక విజ్ఞానమని నమ్ము, విశ్వ. 19

ఆ. ఋషు లెఱుంగనట్టి విషయంబు భువి లేదు
వారు సెప్పినంత వరుస నగును
తెలియక నెడువారు దేబెలు నిజమయా, విశ్వ. 20

ఆ. ఎక్కువయును తక్కు వెట్టివి వారికి
తనువు సతము గాదు తథ్య మరయ
నెఱిఁగి తిరుగ లేరిఁ కేమన మూర్ఖులు, విశ్వ. 21

ఆ. ఎడ్డెఁ దెల్పవచ్చు నేఁడాదికైనను
మానిఁ దెల్పవచ్చు మాసమునను
మొప్పెఁ దెల్పరాదు ముప్పదేండ్లకునైన, విశ్వ. 22

ఆ. ఎండనీడచంద మెఱుఁగనేరఁడ యోగి
యుండు నెల్లకాల ముర్విమీఁదఁ
దిండిపోతు నాఁగఁ దిరుగుచునుండురా, విశ్వ. 23

ఆ. ఎంతచదువుఁ జదివి యెన్నియో విన్నను
హీనుఁ డవగుణంబు మానలేఁడు
బొగ్గు పాలఁగడుగఁబోవునా నైల్యంబు, విశ్వ. 24

ఆ. ఎదట నున్నవాని నెప్పుడు గానక
కుదుటివాని వెదుకఁ బదరుచుండ్రు
పదటకొడుకులకును భయ మేలగల్గదు?, విశ్వ. 25

ఆ. ఎలుకతోలు తెచ్చి యెందాక నుదికిన
నలుపు నలుపె కాని తెలుపు కాదు
కొయ్యబొమ్మఁ దెచ్చి కొట్టినగుణియానె, విశ్వ. 26

ఆ. ఒకని జెఱుతు మంచు నుల్లమం దెంతురు
తమకుఁ గలుగుచేటుఁ దా మెఱుఁగక
తమ్ముఁ జెఱుచువాఁడు దైవంబుగాఁడొకో, వి. 27

ఆ. ఓగు నోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావ మిచ్చి మెచ్చు పరమలుబ్ధు
పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా?, విశ్వ. 28

ఆ. ఓగుబా గెఱుఁగక యుత్తమాధమజనంబు
లిల సుధీజనముల నెంచఁ జూచు
కరిని గాంచి కుక్క మొఱిఁగినసామ్యమా, వి. 29

ఆ. ఔ నటంచు నొక్కఁ డాడినమాటకు
కా దటంచుఁ బలుక క్షణము పట్టు
దాని నిలువఁ దీయఁ దాతలు దిగవలె, విశ్వ. 30

ఆ. ఔర యెంతవార లల్లరిమానవుల్
ప్రభువు నైన గేలిపఱతు రెన్నఁ
దాఁ దెగించువాఁడు దండియా భువిలోన, వి. 31

ఆ. కండకావరమునఁ గానఁడు మరణంబు
మదముచేతఁ దత్త్వమహిమఁ గనఁడు
భోగవాంఛచేతఁ బురహరుఁ గానఁడు, విశ్వ. 32

ఆ. కన్నులందు మదము గప్పి కానరు గాని
నిరుడు ముందటేఁడు నిన్న మొన్న
దగ్ధులైనవారు తమకంటె తక్కువా ? విశ్వ 33

ఆ. కఫము మీఱి మఱియుఁ గనులు మూఁతలువడి
బుద్ధి తప్పి చాలఁ బుడమి మఱచు
వేళలందు నిన్ను వెదకుట సాధ్యమా, విశ్వ. 34

ఆ. కర్మగుణములన్ని కడఁ బెట్టి నడవమి
దత్త్వ మెట్లు తన్నుఁ దగులు కొనును
నూనె లేక దివ్వె నూవుల వెల్గునా, విశ్వ. 35

ఆ. కల్లయైన జగము గనుటెల్ల నిజ మని
నమ్మి భ్రమను జిక్కి నాతిఁ గూడి
యెల్ల జనులు మఱతు రేకాంతుఁ డగుహరి, వి. 36

ఆ. కసవు దినును గాదె పసరంబు లెప్పుడు
చెప్పినట్టు వినుచుఁ జేయుఁ బనులు
వానిపాటియైన మానవుఁ డొప్పుఁడా?, విశ్వ. 37

ఆ. కసవులు దినువాఁడు ఘనఫలమురుచి
గానలేఁడు గాదె వానియట్లు
చిన్న చదువులకును మిన్నజ్ఞానము రాదు, వి. 38

ఆ. కుక్కతోఁక దెచ్చి గొట్టంబుఁ జేర్చిన
క్రోవి చెంతనుండు కొంతతడవు
ఎంత జెప్పఁజెడుగు పంతంబు మానునా, విశ్వ. 39

ఆ. కుండ చిల్లివడిన గుడ్డ దోఁపఁగవచ్చు
పనికి వీలుపడును బాగుగాను
గూలఁబడిన నరుఁడు కుదురుట యరుదయా, వి. 40

ఆ. ఖరముపాలు తెచ్చి కాచి చక్కెర వేయ
భక్ష్యమగునె యెన్న భ్రష్టుఁ డట్లె
యెంతఁ జెప్పి చివర నెసఁగింప బొసఁగునే, వి. 41

ఆ. గాఢమేనినిండ గంధంబుఁ బూసిన
బూడిలోనఁ బడుచుఁ బొరలు మరల
మోటువారి సొగసు మోస్తరియ్యదిసుమీ, వి. 42

ఆ. గుడ్డు వచ్చి పిల్ల గోరడా లాడిన
విధముగా నెఱుఁగక వెఱ్ఱిజనులు
జ్ఞానులైనవారి గర్హింతు రూరక, విశ్వ. 43

ఆ. గురువునకును పుచ్చకూరైన నీయరు
అరయ వేశ్య కిత్తు రర్థ మెల్ల
గురుఁడు వేశ్యకన్న గుణహీనుఁడేమొకో, విశ్వ. 44

ఆ. గూబచేర గృహము గునిసి పాడుగఁ బెట్టి
వెళ్లిపోదు రెంత వెఱ్ఱివారో
గూబగృహము లేమి కూర్చురాకర్మంబు, విశ్వ. 45

ఆ. గ్రాస మింత లేక కడుఁ గష్టపడుచున్న
విద్య యేల నిలుచు వెడలుఁ గాక
పచ్చికుండ నీళ్లు పట్టిన నిలుచునా, విశ్వ. 46

ఆ. చెఱకు తీపిలేమిఁ జెత్తనాఁ బడునట్లు
పరగు గుణములేని పండితుండు
దూఱువడునుగాదె దోష మటుండఁగ, విశ్వ. 47

ఆ. చదివి చదివి కొంత జదువంగఁ
చదువు చదివి యింకఁ జదువు చదివి
చదువు మర్మములను జదువలేఁ డయ్యెను, వి. 48

ఆ. చందమెఱిఁగి మాటఁ జక్కఁగాఁ జెప్పిన
నెవ్వఁడైన మాఱెఁ కేల పలుకు
చందమెఱిఁగియుండు సందర్భమెఱుఁగుము, వి. 49

ఆ. జననమరణములకు సరి స్వతంత్రుఁడు గాఁడు
మొదటఁ గర్తకాఁడు తుదను కాఁడు
నడుమఁ గర్తననుట నగుబాటు కాదొకో, వి. 50

ఆ. తగదు తగ దటంచు తగువారు చెప్పిన
వినఁడు మొఱకు చెడును గొనకు నిజము
మునులు చెప్పుధర్మముల మీఱ నింతేరా! వి. 51

ఆ. తనదు బాగు గోరి ధర్మంబుఁ జెప్పినఁ
దిట్టుచుండ్రు మొఱకు లెట్టయెదుట
గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు, వి. 52

క. తనలో సర్వం బుండఁగఁ
దనలోపల వెదక లేక ధర వెదకెడి యీ
తనువుల మోసెడు నెద్దుల
మనములఁ దెల్పంగవశమె మహిలో వేమా! 53

ఆ. తన్నుఁజూచి యొరులు దగ మెచ్చవలె నని
సొమ్ము లెఱువుఁబెట్టు నెమ్మిమీఱ
నొరులకొఱకు తాన యుబ్బుచు నుండును, వి. 54

క. తలఁ దాఁకినపుడు తలఁతురు
తల క్రిందై పడినయపుడు తలవరు శివునిన్
పలుగాకు లిలను సాజము
కలనాఁ డెన్నరె యదేమి కర్మము వేమా. 56

ఆ. తల్లి యున్నయపుడె తనదుగారాబము
లామె పోవఁ దన్ను నరయ రెవరు
మంచికాల మపుడె మర్యాద నార్జింపు, వి. 55

ఆ. తామసంపుఁ బనులు తగ వెందులకు నైన
తామసంబు నుడుగఁ దగు సుజనుఁడు
తామసంబు నెంచు ధరలోన మూర్ఖుండు, వి. 57

ఆ. తుమ్మచెట్టుకు ముండ్లు తోడనే పుట్టును
విత్తులోననుండి వెడలునట్లు
మూర్ఖునకును బుద్ధి ముందుగా పుట్టును, వి. 58

ఆ. దాన మరసి చేయువానిదగ్గఱఁ జేరి
వక్రభాషణములు వలుకు మొఱకు
చందనతరువందు సర్ప మున్నట్లయా, వి. 59

ఉ. తాతజనించెఁగన్యకకుఁ దండ్రులు తాముసు కుండ
గోళకుల్, మాత పరానుకూలినియె మక్కువ
ద్రౌపది భర్తలేవురుర్, నీతులు సెప్ప పాండవు
ల నీతులు నిట్టివటంచు నెన్నుచుర్, భూతల
మందు నెంతయును బూమెలు చేసిరి వెఱ్ఱివేమనా. 60

ఆ. ధర్మ మన్న వినరు తనువు నమ్మిన నరుల్
యమునివారు వచ్చి యడలఁ జేసి
చొచ్చికట్ట తమరు చొరఁబారఁ గలరొకో, వి. 61

ఆ. నీటిలోని వ్రాఁత నిలువక యున్నట్లు
పాటిజగతి లేదు పరము లేదు
మాటమాటకెల్ల మారును మూర్ఖుఁడు, వి. 62

ఆ. నీళ్ళుపోసి కడిగి నిత్యము శోధించి
కూడువెట్టి మీఁదఁ గోక కట్టి
యేమిపాట్లో పడుదు రీదేహమునకయి, వి. 63

ఆ. పరగఁ దా నొసఁగఁడు పరులు చెప్పినదైన
నియ్యఁజాలక విధి నెసఁగువాఁడు
పొట్టు తినెడిలండి బువ్వలు పెట్టునా, విశ్వ. 64

ఆ. పర్వతవనవాసి పరిణామవర్తన
కూపవాసి కెట్లు గుఱుతుపడును
బ్రహ్మదేవువెంటఁ బ్రాకృతుఁ డరుగునా?, వి. 65

ఆ. పాముకన్న లేదు పాపిష్ఠి యగుజీవి
యట్టిపాము చెప్పినట్టు వినును
ఇలను మూర్ఖుఁ దెల్ప నెవ్వరివశమయా, వి. 66

ఆ. పుట్టుఫలము లేని పురుషాధములు భువిఁ
బుట్ట నేమి లేక గిట్ట నేమి
పుట్టలోన చెదలు పుట్టదా? గిట్టదా? విశ్వ. 67

ఆ. పొట్లకాయ రాయి పొదుగుత్రాటను గట్ట
లీలతోడ వంక లేక పెరుఁగుఁ
గుక్కతోఁకఁ గట్టఁ గుదురునా చక్కఁగా? వి. 68

ఆ. బట్టిపెట్టి నాల్గు బానలచముడతో
వండి శుద్ధిచేయ దండి యగునె?
పుట్టునందుకలుగుఁ బూర్వపుణ్యంబున్న, వి. 69

ఆ. బందుబూతులాడు పరమనీచుం డెన్న
వండివారి మేల్మి దా నెఱుఁగునె
చందనంబు ఘనత పంది యే మెఱుఁగును? వి. 70

ఆ. బౌద్ధమతమువారు బుద్ధి దైవం బని
మెచ్చుతక్కు వాడి తుచ్ఛమతిని
గాడ్దెలగుమివలె గ్రక్కునఁ బడుదురు. వి. 71

ఆ. మఘువుఁ డైన నేమి మర్యాద యెఱుఁగని
వారలేల తెలిసి గౌరవింత్రు
ఉరిమి మెఱుఁగుకుక్క యోగినే మెఱుఁగురా? వి. 72

ఆ. మంచివారు లేరు మహిమీఁద వెదకినఁ
గష్టు లెందఱైనఁ గలరు భువిని
పసిడి లేదు కాని పదడెంత లేదయా, వి. 73

ఆ. మంత్ర మెల్ల మఱచి మధురాధరముఁ గోరి
ఎట్లు మొఱకుఁ డోడయు నెఱుఁగఁ గలఁడు
ఉవిదఁ జూచి పరమయోగంబు మఱచును, వి. 74

ఆ. మర్మమెఱుఁగ లేని మనుజు లెల్లరు నిట్లు
మాలదాసరులకు మడుపు లిచ్చి
మహినిగాచునట్టిమనుకులం బెఱుఁగరు, వి. 75

ఆ. మాటలాడ గలుగు మర్మము లెఱిఁగిన
పిన్న పెద్ద తనము లెన్న వలదు
పిన్న చేతిదివ్వె పెద్దగా వెలుఁగదా? వి. 76

ఆ. ముక్కు ద్రాళ్ళఁ గుచ్చి ముఱికి పోవఁగఁదోమి
కచ్చనీరునించి కడిగి కడిగి
డొక్కతోమినంతదొరకునా మోక్షంబు? వి. 77

క. ముందరిపోటుల మాన్పను
మం దెందైనను గలుగును మహిలోపల నీ
నిందలపోటులు మాన్పను
మం దెచ్చటకైనఁ గలదె మహిలో వేమా. 78

ఆ. మ్రానుదిద్దవచ్చు మఱివంక లేకుండ
దిద్దవచ్చు రాయి చెన్నగాను
మనసు దిద్దరాదు మహిమీఁద నెవరికి. వి. 79

ఆ. మృగము మృగమనుచును మృగముల దూషింత్రు
మృగముకన్నఁ జెడుగు మూర్ఖుఁడగును
మృగముకున్న గుణము మూర్ఖునకే లేదు, వి. 80

ఆ. యౌవనమునఁ జూడ నది యెఱుకే లేదు
యౌవనంబు నెంతొ రధికముగను
యౌవనంబు తనకు నందకయే ముంచు, వి. 81

ఆ. రాజుమా టనవలె రసికుఁ డాడఁగవలె
నెంతపనికి నుబికి యెగురరాదు
కదిసి యెగిరెనేని గ్రహసమానము గాదె
దొడ్డకొంచె మేల దొరకు వేమ? 82

ఆ. తాయిరూపుఁ జేసి రాజుల మ్రొక్కింప
వన్నె కెక్కునటవె వైభవంబు
కర్త యెవ్వఁ డనుచు కానరు మూర్ఖులు, వి. 83

ఆ. లెక్కలేనియాశ లీలమై యుండఁగాఁ
దిక్కుయెత్తినరుఁడు తిరుగుఁగాక
కుక్కవంటిమనసు గూర్చుండనిచ్చునా?, విశ్వ 84

ఆ. వనములోనఁ దిరుగువరమౌను లైనను
మనసు కుదురకున్న మమతచేత
చెడుదురన్న మొఱకు చెడుటేమి లెక్కరా?, వి. 85

ఆ. వాచవికిని మొగము వాచినయట్టులు
నదియు నదియుఁ దినఁగ మొదలు వెట్ట
మరల దింక బుద్ధిమర్యాదపోయిన, విశ్వ. 86

ఆ. వాడవదినె కేల వావివర్తనములు
చాడిగాని కేల సత్త్వగుణము
మూఢమతుల కేల ముదముతో జ్ఞానము, విశ్వ. 87

ఆ. వాదబుద్ధిచేత వాదంబు లాడఁగాఁ
బూనియుందురయ్య పుడమిలోన
కర్మమార్గమునను గడతేరలేరయా, విశ్వ. ౮౮

ఆ. విష్ణుభక్తు లెల్ల వెలిబూదిపాలైరి
వాద మేల? మతవిభేద మేల?
తెలియ లింగధరులు తిరుమణిపాలైరి, విశ్వ. 89

క. వెయ్యేఱునదుల జలములు
తియ్యక మఱిమునుఁగఁ బోవఁ దిప్పట కాదా
కొయ్యగులాముకు జ్ఞానము
వెయ్యేనను తెలుపలేము వినరా! వేమా! 90

ఆ. వెఱ్ఱివేషములను వేసికోఁబోకుము
కఱ్ఱికుక్క తెలుపుగాదుసుమ్ము
పుఱ్ఱెలోనిగుణము పూడ్చింపఁజనవలె, విశ్వ. 91

ఆ. శక్తిమహిమ సోఁకి చెడిరయా పురుషులు
ముక్తిమహి మెఱుఁగక మూఢు లగుచు
ఆదిశక్తిగూడ నన్యాయమై పోయె, విశ్వ. 92

ఆ. శివునిమంత్రమే యగు శ్రీహరిమంత్రము
తెలిసి తెలియలేరు తిక్కనరులు
దేవుని మఱచి తమదేహమే యందురు, విశ్వ. 93

ఆ. శ్రవణపుటము లున్న సార్థక్య మేమిరా
వినఁగవలయుఁ బెద్ద లనెడివన్ని
వినఁగ వినఁగ నీకె విశదంబులౌ సుమ్ము, విశ్వ. 94

ఆ. సత్యము విడనాడి సాహసంబులఁ జూపి
బంటుపంతమాడు బత్తి లేక
కర్మజీవి తాను గానంగలేఁడయా, విశ్వ. 95

ఆ. సాధుచరిత యైనసతిసత్ప్రవర్తన
జార యేమెఱుంగు సాధుజనుని
బ్రహ్మనిష్ఠ మెఱకుప్రాకృతుఁ డెఱుఁగునా? వి. 96

ఆ. హీనుఁ డెన్నివిద్య లిల నభ్యసించిన
ఘనుఁడు గాఁడు మెఱకు జనుఁడె గాని
పరిమళముల గర్ధభముమోయ ఘన మౌనె? వి. 97

—*—

## దాంభిక పద్ధతి

—*—

ఆ. అచ్చువేసికొన్న నడియేని యన్నను
తమ్మఁ దిన్న పంగదాసుఁడ నన
భాగ్యవశత గాని బ్రదుకులు లేవయా, విశ్వ. 1

ఆ. అందు నిందు వెదకి యనుభవ మందక
కొందఱయ్యె లెపుడు కొంగవలెను
మూర్ఖ తపముఁ బూని మురియుట గానవా, వి. 2

ఆ. అధిక మైనయజ్ఞ మల్పుండు తాఁ జేసి
మొనసి శాస్త్రములని మురువు దక్కు
దొబ్బ నేర్చుకుక్క దుత్తలు మోచునా? విశ్వ. 3

ఆ. అన్న మదమువలన నతివలు మతిచెడి
యేపు రేఁగి మదనుఁ డేఁచె నందు
రన్నముడుఁగు వెనుక నతఁ డెందుఁబోయెరా? వి. 4

ఆ. అన్ని జాతులందు నధికుల మనుచును
యజ్ఞపశువుఁ జంపి యగ్ని నిడుచు
మల్లయందుఁ బెట్టి మాంసంబు తిందురు, విశ్వ. 5

ఆ. అరయ దోఁచికొనుచు గురు వని తన్నెంచి
తిరుగువాఁడు తన్ను నరయ లేఁడు
పనికిమాలినట్టి బానిసకొడుకురా, విశ్వ. 6

ఆ. అఱుత లింగముండ నది యెఱుంగఁగ లేక
పర్వతంబుఁ బోవు బానిసీఁడు
ముక్తిఁగానవగునె మూఢాత్ముఁ డగుఁగాక, వి. 7

ఆ. అల్లబోడితలలు తెల్లనిగొంగళ్ళు
నొడలఁబూతి పూసి యుందు రెపుడు
ఇట్టి వేషము లిల బొట్టకూటికె సుమా, విశ్వ. 8

ఆ. అక్షమాలఁ బూని యలసటఁ జెందక
కుక్షి నింపుకొనుట కొదువ గాదు
పక్షికొంగరీతి పై చూపు లేలొకో, విశ్వ. 9

ఆ. అక్షరాళి వెంట నడవుల వెంటను
కొంగరాల గోడు గుడువ నేల
హృదయమందు శివుఁ డటుండుట తెలియదా, వి. 10

ఆ. ఆఁకటికి తొలంగు నాచారవిధు లెల్ల
చీకటికి తొలంగు చిత్తశుద్ధి
వేఁకటికి తొలంగు వెనుకటి బిగు వెల్ల, విశ్వ. 11

ఆ. ఆకు లెల్ల దిన్న మేఁకపోతు కేల
కాకపోమె నయ్య కాయసిద్ధి
లోకు లెల్ల వెట్టిపోకళ్ళఁ బోదురు, విశ్వ. 12

ఆ. ఆచరాచరముల నంగాల లింగాలు
సరణి దెలియనట్టి శైవ మేల
అష్టతనుమయుండు హరుఁడౌట తెలియదు, వి. 13

ఆ. ఆఁడుదానిఁ జూడ నర్థంబుఁ జూడఁగ
బ్రహ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
బ్రహ్మయాలిఁ ద్రాఁడు బండిరేవునఁ ద్రెంబ, వి. 14

ఆ. ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధిలేని పాక మేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా? విశ్వ. 15

ఆ. ఆఱు మతములందు నధికమైన మతంబు
లింగ మతముకన్న లేదు భువిని
లింగధార్లకన్న దొంగలు లేరయా? విశ్వ. 16

ఆ. ఆసనములు పన్ని యంగంబు బిగియించి
యొడలు విఱిచికొనెడి యోగు లెల్ల
జెట్టిసాముకన్న చింతాకు తక్కువ, విశ్వ. 17

ఆ. ఇచ్చవచ్చు నరుని కెచ్చువైష్ణవ మిచ్చి
ద్విజులకన్న దొడ్డతీరటంచు
నెల్లవారు నల్లపల్లాండు పాడరా ? విశ్వ. 18

ఆ. ఇల్లు నాలి విడిచి యినుపకచ్చలఁ గట్టి
వంటకంబు నీటివాంఛ లుడిగి
ఒంటినున్న యంత నొదవునా తత్త్వంబు ? వి 19

ఆ. ఇహమునందు సుఖము లీడేరఁగా లేదు
పరమునందు నెట్లు పడయవచ్చు
మొదలలేనిచేఁత తుది ఎట్లువచ్చురా ? విశ్వ 20

ఆ. ఉదయమందు. శూద్రుఁడుత్తమోత్తముఁడెట్లు
సతికి శూద్రతనము సత్యమె కద!
తల్లి శూద్రయయ్యె తానెట్లు బాఁపఁడు? వి. 21

ఆ. ఉపవసించుచుండి యోగి నీళ్ళు మునిఁగియు
కూడువండి వేల్పుఁ గుడుపు మనుచు
దాని నోరుకట్టి తామె తిందురు కదా? వి. 22

ఆ. ఉపవసించినంత నూరఁబందిగఁ బుట్టు
తపసియై దరిద్రతను వహించు
శిలను మ్రొక్కఁగనగునె జీవము గలబొమ్మ? వి. 23

ఆ. ఊరఁబం దెఱుంగ దుత్తరావాచులు
చెడ్డనరక మెల్లఁ జెందుఁ గాక
సాధ్విమహిమ మెట్లు స్వైరిణి యెఱుఁగురా? వి. 24

ఆ. ఊరినడిమిబావియుదకంబు గొని తెచ్చి
పాదతీర్థ మనుచు భ్రమయఁ జేతు
పాదతీర్థ మన్న ఫలమేమి కద్దురా? వి. 25

క. ఊరులు పల్లెలు మానుక
వారక యడివిం జరించువాఁ డరుదెంచున్
వేరులుఁ గూరలు మెసవెడు
వీఱిఁడి కెట మోక్షపదవి వినఁగా వేమా! 26

ఆ. ఎంగిలెంగి లనుచు నీనోటితోడనే
వేదములను జదువు వెఱ్ఱులార
యెంచి చూడ నదియు నెంగిలి కాదొకో? వి. 27

ఆ. ఎంబెరుమత మని యెసఁగి మాంసముఁ దిని
మారుపేర్లు పెట్టి మధువు ద్రావి
వావివరుస దప్పి వర్తించి చెడుదురు, వి. 28

తే. ఏమియైనది పరతత్త్వ మెఱుఁగలేక
సోమయాజులు పశువుల స్రుక్కడంచి
సామమేర్పడఁ జదివినఁ జాన వేల
బాధకము లగు దుర్గుణపంక్తి వేమ. 29

ఆ. ఐన దాని కింక కాని దానికి నైన
నాఁడువారిమాట లాడుమన్న
సాహసమున పెక్కు లూహలు పనుతురు, వి. 30

ఆ. ఒడల బూది పూసి జడలు ధరించిన
నొడయఁ డగును ముక్తి బడయలేఁడు
తడక బిఱ్ఱువెట్టఁ దలుపుతో సరియానె? వి. 31

ఆ. ఒడ్డుఁబొడుగుఁగలిగి గడ్డముం బొడవైన
దానగుణము లేక దాత యగునె
యెనుము గొప్పదైన నేనుఁగుఁ బోలునా? వి. 32

ఆ. కడుపు బోరగించి కన్నులు ముకుళించి
బిఱ్ఱబిగిసికొన్న బీదయోగి
యముని బారిగొఱ్ఱె యతఁ డేమి సేయురా. వి, 33

ఆ. కంబళములఁ గట్టి గంతల గజ్జల
బోడితలల సొంపు పొల్పు మీఱఁ
గడుపుకొఱకుఁ దిరుగ ఘనులౌదురా వారు? వి. 34

ఆ. కల్లటి కెకు భూతి గట్టిగాఁ బెట్టిన
నందులోని కంపు లడఁగనట్టు
మెడను ద్రాడువేయ మెఱయుచు ద్విజుఁడౌనె? వి. 35

ఆ. కావిపంచగట్టి కడుయోగివలె నుండి
వెలికిఁ గోర్కె లెల్ల విడిచిపెట్టి
తొరగి తిరుగువాఁడు దొంగసన్న్యాసిరా, వి. 36

ఆ. కుక్కుటమననంబు కొక్కెర ధ్యానంబు
యతులనొసట నొనరునట్లు వ్రాసెఁ
దొల్లి చేసినట్టి దోషంబు తగిలెనో? విశ్వ. 37

ఆ. కులము నీఱుచేసి గురువును వధియింప
బూసంగ నేనుఁగంతబొంకు బొంకె
పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా, విశ్వ. 38

తే. గుహలుపదివేలు సొచ్చిన గుణము పోదు
నియతగురుభక్తికావలె నేర్పుమీఱ
మహితపరతత్త్వ భావంబు మధుర మగును
దాని సాధింపనే మఱి ప్రాను వేమ. 39

తే. గూబవలె గ్రుడ్లుద్రిప్పిన గుణము రాదు
లోభ మోహము లుడుగంగ లాభమగును
దేబెలై భిక్ష మెత్తుట తీర్చ దెపుడు
డాబుచేసిన లక్ష్యమడంగు వేమ. 40

ఆ. ఘటము నింద్రియములఁ గట్టివేయగ లేక
చావువచ్చునప్పుడు సన్న్యసించు
నాత్మశుద్ధి లేక యందునా మోక్షంబు? వి. 41

ఆ. చిలుక నోరుగట్టి చిత్తజు మెడఁగట్టి
కచ్చడంబు బిగియఁ గట్టికొన్న
మనసువశముగాదె! మహినేమిపాపము? విశ్వ. 42

ఆ. చక్కనిసతి యైన సరసురాలైనను
మే నొరులను గాన నీయకున్న
సంద్రె గ్రుంకినంత సయ్యాటలాడదా? విశ్వ. 43

ఆ. చదువు చదువనేల సన్యాసి కానేల
షణ్మతములఁ జిక్కి చావ నేల
అతని భజనఁజేసి యాత్మలోఁ దెలియుఁడీ, విశ్వ. 44

ఆ. చాలదయ్య యింక చార్వాకమతరీతి
శక్తి శైవ మనుచుఁ జాల నమ్మి
సరణి మిగిలి చెడును చండాలసేవచే, విశ్వ. 45

ఆ. జడలు గట్టనేల సన్యాసి కానేల
నొడలు విఱుచుకొనెడి యోగ మేల
ముక్తికాంతఁ బట్టి ముద్దాడనే కదా? విశ్వ. 46

ఆ. జాతులందు మిగుల జాతి యే దెక్కువో
యెఱుక లేక తిరుగ నేమి ఫలము
యెఱుకగలుగువాఁడె యెచ్చైనకులజుండు, వి. 47

ఆ. టిప్పణములు సేసి చప్పనిమాటలఁ
జెప్పుచుందు రన్ని శ్రుతులు స్మృతులు
విప్పి చెప్ప రేల వేదాంత సారంబు? విశ్వ. 48

ఆ. తింగణాలు బలసి నింగికి నెగిరినఁ
జెట్టుచివరపండు చేతఁ బడునె
పుస్తకములుచదువఁ బొందునా మోక్షముల్, వి. 49

ఆ. దగ్గఱకుము పాపదాంభికులను నీవు
మోసపుత్తురయ్య దోసమనక
క్రూరమృగములట్టివారురా నమ్మకు, విశ్వ. 50

ఆ. తంత్రమంత్రములను తారకమబ్బునా
యంత్ర బలము గురునిమంత్ర మూని
చింతఁజేయునపుడె చిన్మయ మందురా, విశ్వ. 51

ఆ. తనువునందు నగ్ని దఱికొని కాలంగఁ
గాల్చుకొనుట యేమికర్మమునకొ
కాల్చుకొన్న యంతఘనుఁడు తానయ్యెనా? వి. 52

ఆ. తనువు లస్థిర మని ధనము లస్థిర మని
తెలుపఁగలఁడు తాను తెలియలేఁడు
చెప్పవచ్చుఁ బనులు సేయుటకష్టమౌ, విశ్వ. 53

ఆ. తప్పువేషమూని ధరలోనఁ దిరిగెడు
సేఁతలెల్ల మిత్తిఁ జేరుటకునె
కడుపునిండ నింత కష్టంబు లేలరా? విశ్వ. 54

ఆ. తిరుపతికిని బోవఁ దుఱక దాసరి గాఁడు
కాశికేఁగఁ బంది గజము గాదు
కుక్కసింహ మగునె గోదావరికిఁ బోవ? విశ్వ. 55

ఆ. తోలుకడుపులోన దొడ్డవాఁ డుండఁగ
రాతిగుళ్ళ నేల రాశిఁ బోయ
రాయి దేవుఁడైన రాసులు మ్రింగదా? విశ్వ. 56

ఆ. దేశదేశములను తిరుగంగ తిరుగంగ
నాత్మయందు ధ్యాన మంటుకొనునె?
కాసులకును తిరుగఁ గల్గునా మోక్షంబు? విశ్వ. 57

ఆ. దొంగమంత్రములను దొరకునా మోక్షంబు
చేతఁగాని చేత చెల్ల దెపుడు
గురువటంద్రె వానిగుణహీనుఁ డనవలె, విశ్వ. 58

ఆ. ద్వాదశతిరుమణులు దగునట్టు ధరియించి
ద్రవిడగ్రంథములను దనరఁ జదివి
అక్షయమగు పాత్ర నమరంగఁ దాల్తురు, విశ్వ. 59

ఆ. నీళ్ల మున్గఁగ నేల నిధులఁ బెట్టఁగ నేల
మొనసి వేల్పులకును మ్రొక్క నేల
కపటకల్మషములు కడుపులోనుండఁగా, విశ్వ. 60

ఆ. పట్టుబట్టఁగట్టి పట్టనామముఁ బెట్టి
వట్టిభ్రాంతిఁ జెంది వైష్ణవుఁ డయి
లొట్టిదాగినత్రఁడు లోకులఁజెఱుచురా, విశ్వ. 61

ఆ. పరఁగ ప్రతిమలకును ప్రాణప్రతిష్ఠలో!
ప్రాణ మొసఁగ ప్రతిమ పలుకవలదె
మొదటివానిసృష్టి మూర్తిమంతంబైన, విశ్వ. 62

ఆ. పరమయోగుల మని పరముఁ జేరఁగ లేని
మాయజనుల కెట్లు మంచి కలుగు
వేసములను విడచి విహరింప ముక్తియా, విశ్వ. 63

ఆ. పరుల మోసపుచ్చి పరధన మార్జించి
కడుపు నించుకొనుట కానిపద్దు
ఋణముసేయ మనుజుఁడెక్కువ కెక్కునా? విశ్వ. 64

ఆ. పిండములను జేసి పితరులఁ దలపోసి
కాకులకును బెట్టు ఖలుఁడు దినము
పెంటఁదినెడి కాకి పితరెట్టు లయ్యెనో! విశ్వ. 65

ఆ. పేరుసోమయాజి పెను సింహబలుఁ డాయె
మేఁకపోఁతుఁ బట్టి మెడను విఱువఁ
గాక క్రతువువలనఁ గలుగునా మోక్షంబు? వి. 66

ఆ. బండెత్రాళ్లఁ దెచ్చి బంధించి కట్టంగ
లింగఁడేమి దొంగిలించినాఁడో
ఆత్మలింగమునకు నర్చింప నేరరో, విశ్వ. 67

ఆ. బ్రాహ్మణులమటంచ్రు బ్రహ్మత్వ మదిలేని
బ్రాహ్మ్య మద్దియేల బ్రాహ్మణుఁడట
బొమ్మవలెను దాను బెమ్మఁపైఁ గూర్చుండ, వి. 68

ఆ. భాగవతుల మనుచుఁ బరగంగ నెవ్వారు
వారి నెఱుఁగ లేరు వరుసతోడ
ఆడిపాడువార లరయ భాగవతులా? విశ్వ. 69

ఆ. భూతి దేహమందుఁ బూసిన నయ్యేనా
నిష్ఠ శివునియందు నిలుపవలయుఁ
గాక బూడ్దెయందు గాడిద పొరలదా? వి. 70

ఆ. భూతిపూసి నీవు ప్రాతభూతంబుల
వెడలఁ గొట్టఁబోవ వెఱ్ఱి వనుచు
నిన్ను కాంచి భీతి నిలువక పారరో. విశ్వ. 71

ఆ. మతపువేషధార్లు మహిమీఁదఁ బదివేలు
మూఢజనులఁ గలప మూఁగుచుంద్రు
కొంగలు గుమిగూడి కొఱకవా బోదెలు? వి. 72

ఆ. మనసున దయలేని మాలకొడుకునొద్దఁ
జేరియున్న ప్రజకు చేటు నిజము
పెద్దతనము లెంచఁ బెంకెల చందమా, విశ్వ. 73

ఆ. మాల మేలుగుణము మంచిదికలిగిన
మాలకూడుఁగుడుచు మనుజుకంటె
గుణమె మేలుకాని కుల మేమి మేలురా? వి. 74

తే. ముక్కు కన్నులు చెవు లంటి మూయనేల
తెలిపి తెరగంటిలోపలఁ దేటపఱచి
తిరుగనేర్చినవాఁడె పో ధీజితుండు
ఊరకయ మూయ డంబంబు లోరి వేమ. 75

ఆ. ముద్ర లన్న నేమొ మురిసెద రయ్యయో
భద్రముగను మనసు పరగకున్న
వెఱ్ఱిచేష్ట లగును వివరింప ముద్రలు, విశ్వ. 76

ఆ. మొనసి యింద్రియముల మొదట నిల్వఁగలేక
సమసిపోవువేళ సన్న్యసింత్రు
ఆత్మశుద్ధి లేక యంటునా మోక్షంబు, వి. 77

ఆ. మోసమునను దనకు మొదటిముఖ్యతహాని
మోసమునను తనదు మురువు దప్పు
మోసమునను తనదు మోక్షము తప్పురా, వి. 78

ఆ. ముచ్చు గుడికి పోయి ముడివిప్పనేకాని
పొసఁగ స్వామిఁ జూడఁ బోఁడతండు
కుక్కయిల్లు సొచ్చి కుండలు వెతకదా, విశ్వ. 79

ఆ. యజ్ఞయాగము లని యన్ని చేసినఁ గాని
ఆత్మయజ్ఞ మగునె యంటివాడ
క్రతువు చేయువారు కానంగ దొంగలు, వి. 80

ఆ. రాతిబొమ్మ కేల రంగైనవలువలు
గుళ్ళుగోపురములుఁ గుంభములును
కూడుగుడ్డ తాను గోరునా దేవుఁడు? విశ్వ. 81

ఆ. రాయి యయ్యె దైవరాయఁడు భువిలోన
భక్తి మొక్కువారు బండలెకద
దేవునంతవారు భావింప భక్తులా? విశ్వ. 82

ఆ. రుద్రరూపుఁ దాల్చి రుద్రుని నిందించు
భ్రష్టుత్రోవ నరుగు భ్రష్టజనుఁడు
అంకునకును తిరుగురమణులవలెనుంద్రు, విశ్వ. 83

ఆ. లోన బదిలపఱచి లోవికారం బెల్లఁ
దరుగకున్న వాఁడు తపసికాఁడు
వెలివికార మెల్ల విధిపాలికోర్వ లేరె? విశ్వ. 84

ఆ. వడుగు ద్విజుల కెల్లఁ గడుముఖ్య మందురు
వడుగుఁ జేసెద మని వదరుచుంద్రు
కడుగుఁ ద్రావి కాకి కఱ్ఱుకఱ్ఱన్నట్లు, విశ్వ. 85

ఆ. వంతు లింగమునను వరుసబూడిదెఁ బూసె
అంతరంగ మెఱుఁగ నంత్యజాతి
సంతబసివికొడుకు జంగముదేవరా. విశ్వ. 86

ఆ. విన్న సుద్ది కొంత విననిసుద్దులు కొన్ని
వింతసుద్దు లెన్నొ వినఁగఁ జెప్పు
దాను గన్న యట్టి దాంభికుఁ డెప్పుడు, విశ్వ. 87

ఆ. విప్రవరుల మనుచు వేదంబు చదువక
ప్రాకృతులను జూచి పరిహసించు
ధరణిసురులకన్న దాసరిమతి మెచ్చు, విశ్వ. 88

ఆ. పొడుగుగల్గుజడలు పులితోలు భూతియు
కడుపాలలు పదిలకుక్షులైన
మోఁతచేటె కాని మోక్షంబు లేదయా, వి. 89

ఆ. వెఱ్ఱిబట్టు వాసి వినయము లధికముల్
చెడ్డముండమునుఁగు చెలఁగుచుండు
చెడిపెకొడుకు మిగులఁ జేయునాచారంబు, వి. 90

ఆ. వేనవేలు చేరి వెఱ్ఱికుక్కలవలె
అర్థహీనవేద మఱచుచుండ్రు
కంఠశోషకంటె కలిగెడి ఫల మేమి? విశ్వ. 91

ఆ. వైశ్యుల మనియెడి వార్తమాత్రమె కాని
దొంగ లింతకంటె దొరకఁబోరు
నేలమీఁద వీరి నేర్పుల నేమందు? విశ్వ. 92

ఆ. శీలమనుచు నరుడు సిగ్గింతయును లేక
పరులసొమ్ము లెల్ల పరిహరించి
వేషభాషవలన మోసంబుఁ జేయును, విశ్వ. 93

ఆ. సకలతీర్థములను సకల యజ్ఞంబుల
తలలఁ గొరుగకున్న ఫలము గలదె
మంత్రజలముకంటె మంగలిజలమెచ్చు, విశ్వ. 94

ఆ. సతులు జపతపములు సల్పఁగ సాగిన
బురుషు లేల నింక బుడమిలోన
పాప మెంచవద్దు పట్టి శిక్షింపుఁడి, విశ్వ. 95

ఆ. సంధ్య వార్చఁగ నేమి జపము సేయఁగ నేమి
వేదశాస్త్రములను వెలయ నేమి
పరము గననివాఁడు బాపఁడు గాఁడురా, వి. 96

ఆ. సోమయాజి ననుచు సొంపైన శాలువల్
మకరకుండలములు మనసు దీరఁ
దా ధరించు మనకుఁ దా నేమి లాభించు? వి. 97

ఆ. హీనజాతివాని కిచ్చువైష్ణవ మిచ్చి
ద్విజుల కన్న దొడ్డ తీరటంద్రు
కల్లకడవ గడిగి గంగ నించిన రీతి, విశ్వ. 98

క. హృదయము పదిలంబైనను
గుదికొను సన్న్యాసమునకు, గొమ్ములు గలవా
యిదె మొఱఁగరు చదువరు లట
మది ముక్తికి నాస్పదంబు మహిలో వేమా. 99

—✲—

# విద్వత్పద్ధతి

—*—

ఆ. అంది యందనట్టి యచలస్వరూపంబు
పొందుపడఁగ బూని పొదలువాఁడు
చెంది మిన్నకుండుఁ జిన్మయాకారుఁడు, విశ్వ. 1

ఆ. అన్నమునకు నంట దయిన నాత్మకు నంటు
ఆత్మను బెనఁగొన్న యన్నమంటు
ఆత్మశుద్ధి యన్న మన్నశుద్ధియు నాత్మ, విశ్వ. 2

ఆ. అరయ మూలమందు నర్థంబునందును
నిర్మలాత్మునందు నియతునందు
బయలునందు శ్రుతులభావంబు నొక్కటి
వెలయు శివునిఁ జూచు వేడ్క వేమ. 3

ఆ. అష్టతనువులకును నాదిమ మైనట్టి
యాదిశక్తి గూడి యభవుఁ డగును
భయము లేకయుండు బ్రహ్మజ్ఞుఁడగుయోగి, వి. 4

తే. ఆత్మతనలోన గమకించి యనుదినంబు
నిర్గుణాత్మార్చనముఁ జేసి నిత్య మమర
బ్రత్యగాత్మను లో నెంచి ప్రబలుయోగి
సచ్చిదానందపద మందు సతతము వేమ. 5

ఆ. ఆత్మలోని సొమ్ము నంజనమునఁ జూచి
యంటితిరుగునట్టి యతఁడు యోగి
పుంజు గూటనుండి ప్రొద్దెఱింగిన కూయు, వి. 6

ఆ. ఆర్యులైనఘనులు కార్యహీనులు గారు
శౌర్యధైర్యములను సంతరించి
పూర్ణభావ మమరఁ బొందుచు నుందురు, వి. 7

ఆ. ఇంటిలోని జ్యోతి యెంతయు వెలుగఁగాఁ
బొరుగువారి యగ్గి కరుగ దెపుడు
తాను దైవమాయె దైవముఁ గొలుచునా, వి. 8

ఆ. ఇసుక బొగ్గు రాయి యినుమును స్వర్ణంబు
కసవుపోచవలెను గనుచునుండి
పరమపదము గాంచు పరిణామమందున, వి. 9

ఆ. ఈఁది దాఁటఁగలఁడు నేనాగరంబైన
సాధువృత్తితోడ సమయమందు
పాదుకొనుచు మనసు పరిపూర్ణ మొందును, వి. 10

ఆ. ఈశ్వరునిఁ దలంప నేడుపాళ్ళుగఁ జేసి
తనదు మూర్తి నెల్ల ధారఁబోసి
నిత్యకర్మములను నిలుచురా నెఱయోగి, వి 11

ఆ. ఉత్తమశివయోగి యూహించి మదిమించి
సత్తమమునఁ బోరి సరకుగొనఁడు
పొత్తుమఱచియుండు పూర్ణభావంబున. వి, 12

తే. ఉదరపోషణకొఱకు కన్న నుబ్బరాదు
మదిని లోగుట్టు విడకయే మర్మమూను
సదయహృదయుండు శివయోగి శాశ్వతుండు
ఉపము సాధించి మించెడు నుర్వివేమ. 13

ఆ. ఉద్ధరింపఁ గలుగు నుత్తముండు కులంబు
మధ్యముండు దానిమాట గనఁడు
అధముఁడైనవాఁ డడంగించునొక్కట, విశ్వ. 14

ఆ. ఉప్పుఁ గప్పురంబు నొక్కపోలికనుండు
చూడఁజూడ రుచులజాడ వేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేఱయా, వి. 15

ఆ. ఊగియూగి లాగి యున్నది గనఁగోరు
సాగ లాగి పట్టు సాక్షిగాను
యోగమమర ముక్తినొందును ప్రాజ్ఞుఁడు, విశ్వ. 16

ఆ. ఊరు విడువకుండు నుత్తమశివయోగి
పోరి చూచు మదిని బూర్ణసుఖము
దారిలోని నక్క తలపెట్టఁ బోవునే, విశ్వ. 17

ఆ. ఎండయనక తిరుగు నిర వెఱింగినయోగి
నీడ నున్న దానిజూడవలెన
ఎండనీడ లున్నెఱుకకుఁ జూడఁడు, విశ్వ. 18

ఆ. ఎందు నెఱుకవాని కిహపరములు లేవు
ప్రాణహాని లేదు ప్రళయమునను
ప్రళయకాలమైనఁ బరమాత్మఁ గలియును, విశ్వ. 19

ఆ. ఏమహాత్మునందు నిజ్జగములు పుట్టు
నామహాత్మభజన యనువు మీఱ
నియమనిష్ఠ నెఱిపి నెమ్మది గనవలె, విశ్వ. 20

ఆ. ఒదిగి యొదిగి గురువు నొప్పుగా నొప్పించి
మదిని నిల్పి జాతిమమత విడిచి
కదియుచుండు నతఁడు కలకాల మొకరీతి, విశ్వ. 21

తే. ఔచితిం గన్నవాఁ డెపు డర్హమైన
గౌరవమ్మును పదవిని గనుచు నుండు
సర్వజనులును బూజింప సంతసమును
దండి దాకీర్తినార్జించుచుండు వేమ. 22

తే. కడఁగి సంకల్పముల నెల్ల కట్టిపెట్టి
చిత్తమున నేమి తలఁపక చిత్రరూపు
కైవడిని నుండు నాతడు ఘనుఁడు దలఁప, విశ్వ. 23

ఆ. కనఁగ సొమ్ము లెన్నొ! కనకం బదొక్కటె
పసులవన్నె లెన్నొ! పా లొకటియె
పుష్పజాతు లెన్నొ! పూజయొక్కటెసుమీ, వి. 24

ఆ. కప్పురంపు మనసు గాంక్షించు యోగికి
జ్ఞానదీపశిఖయుఁ దా నటించుఁ
గానవచ్చు నాత్మకమమాణ మైయుండు, విశ్వ. 25

ఆ. కల్లగురుఁడు గట్టు కర్మచయంబులు
మధ్యగురుఁడు గట్టు మంత్రచయము
ఉత్తముండు గట్టు యోగసామ్రాజ్యంబు, విశ్వ. 26

ఆ. కలుషమానసులకు గాన్పింపఁ గా రాదు
అడుసులోన భానుఁ డడంగినట్లు
తేటనీరు పుణ్యదేహ మట్లుండురా, విశ్వ. 27

ఆ. కస్తురి యటుచూడఁ గాంతి నల్లగ నుండు
పరిమళించు దానిపరిమళంబు
గురువులైనవారిగుణము లీలాగురా, విశ్వ. 28

ఆ. కాకిగూటిలోన కోకిల మనినట్లు
భ్రమర మగుచుఁ బురువు బ్రతికినట్లు
గురువులాదు రిలను గుణు లిట్లు వర్తింత్రు, వి. 29

ఆ. కుండ కుంభ మన్న గొండ పర్వత మన్న
నుప్పు లవణ మన్న నొకటి గాదె
భాష లిట్లె వేరు పరతత్త్వ మొక్కటే, విశ్వ. 30

ఆ. గాలి లేనిదీపకళిక చందంబున
నలలు సుళ్లు లేనిజలధిరీతి
నిశ్చలాత్మ యెన్న నిర్వికారంబున
నుండెనేని పండితుండు వేమ. 31

ఆ. చిత్తశుద్ధి గలిగి చేసినపుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదవకాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత? విశ్వ 32

ఆ. చినుఁగు బట్టకాదు చీనాంబరము గాని
ముఱికి యొడలు కాదు ముక్తి గాని
పరమయోగిమహిమ పరికింప రిట్టులు, విశ్వ. 33

ఆ. చెఱుకులోఁటలోనఁ జెత్తకుప్పుండిన
గొంచెమైన దానిగుణము చెడదు
యెఱుకఁగలుగుచోట నెడ్డెవాఁడున్నట్లు, విశ్వ. 34

ఆ. చదువరిమతికన్న సాధకుమతి మేలు
వేదములను లేదు వాదములను
ఒడలుశుద్ధిఁ జేసి యొడయునిఁ జూచెడు, విశ్వ. 35

క. చూపుల చూపై తోఁచెడి
రూపములకు రూప మదియె రూపము గాకే
దాపై లోపల వెలుపలఁ
గాపగు పరిపూర్ణమూర్తికనవలె సుమతీ. 36

ఆ. జాతి నీతి వేఱు జన్మం బదొక్కటి
అరయదిండ్లు వేఱె యానుగాక
దర్శనములు వేఱు దైవ మానొక్కటి, విశ్వ. 37

ఆ. జీవభేద మెఱిఁగి చెడిపోనివారలు
బ్రహ్మభావమొంది పరగుచుంద్రు
నీరుముత్యమై నీరుగా మారునా, విశ్వ 38

ఆ. జీవియందు భ్రమలు చేరియుండుట కద్దు
జీవభ్రమలయందె జిక్కఁ డెప్పుడు
జీవి జీవియైన జన్మాంతమగుబయల్, విశ్వ. 39

ఆ. తత్త్వవాదు లుంద్రు ధర నెందరైనను
తత్త్వవేదిఁ జూడ ధరణి లేఁడు
గలిగెనేని వాఁడు కానంగఁబడఁడయా, విశ్వ. 40

ఆ. తనువులోన వెదకి దైవంబు మొనఁజేసి
ముందు కర్మములను మూలఁ ద్రోసి
మనసు నిజముఁ జేసి మమతలన్నియుఁ గోయు, వి. 41

ఆ॥ తనువులోని యాత్మతత్త్వ మెఱుంగక
వేఱే కలఁ డటంచు వెదుకఁ డెపుడు
భానుఁ డుండ దివ్వె పట్టుచు వెదకునా? విశ్వ. 42

ఆ॥ తన్నెఱుఁగనివాడు తానె తానై యుండు,
దన్నెఱిఁగినవాఁడుఁ దానె తాను
దనువు లేనివాఁడు తానె తానౌ సుమ్మి, విశ్వ. 43

ఆ. తప్పొప్పు దెలిసి దైవసంకీర్తనల్
సేయువారు హరికి సేవకాళి
ని తెఱుఁగక వారి నిందింపఁబోవరు, విశ్వ. 44

ఆ. తరువఁ దరువఁ బుట్టు దరువునం దనలంబు
దరువఁ దరువఁ బుట్టు దధిఘృతంబు
తలపఁ దలపఁ బుట్టు తనువునఁ, దత్త్వంబువిశ్వ. 45

ఆ. తాను నే నని యెడు తత్త్వభేదంబును
మాని యలవివేకమహిమఁ దనరి
యూఱకుండు జ్ఞానియుత్తమోత్తముఁడగు, వి. 46

ఆ. తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
యట్టునిట్టుఁ జూచి యదరిపడక
తన్నుఁ గానియట్లు తత్త్వజ్ఞుఁడుండును, విశ్వ. 47

ఆ. వెఱ్ఱివాని మిగుల విసిగింపఁగారాదు
వెఱ్ఱివానిమాట వినఁగరాదు
వెఱ్ఱికుక్కఁ బట్టి వేటాడఁగారాదు, విశ్వ. 48

ఆ. దేవపూజసేయ దివ్యభోగము గల్గు
తత్త్వమెఱుఁగఁగలదు దైవసముఁడు
యేమి లేనినరుని కేగతి లేదురా, విశ్వ. 49

ఆ. దేహగుణములెల్లఁ దెలిసిన శివయోగి
మోహమందు దవిలి మోసపోఁడు
ఇంద్రజాలకుం డెందును జిక్కఁడు, వి. 50

ఆ. ధ్యానివలెనె యుండు మౌనివలెనె యుండు
భోగివలెనె యుండు రోగివలెనె
సకలమును దెలిసి సర్వజ్ఞుఁడై యుండు, వి. 51

ఆ. నందుఁ డగుచు జ్ఞాని యిందు నం దనకుండు
నన్ని తావులందు హరునివలెనె
తెలియువారికెల్ల దేవుఁడై కాన్పించు, వి. 52

ఆ. పగలు రేయి మఱచి భావంబు మఱచియు
తాను నే ననియెడి తలపు మఱచి
యుండువాని నెంచ యుత్తమయోగిరా, వి. 53

ఆ. పట్టు పట్టబోఁడు పట్టనివిడఁబోఁడు
నెట్టిగుణవికారనిహతి నడఁచి
మిట్టిపడక లోన మిన్నందు విజ్ఞుఁడు, వి. 54

క. పరఁగినగాలి నభంబున
నెఱయంగా భూమియందు నీరుండిగదా
దరిదాపుల వేఱొక్కటి
ఝురవుకొనుం దేజ మిట్టి యెల్లెడ వేమా! 55

ఆ· పరుస మినుముసోఁక బంగారమైనట్లు
కప్పురంబుఁ జ్యోతిఁ గలసినట్లు
పుష్పమందుఁ దావి పొసఁగినట్లగు ముక్తి, వి. 56

ఆ· పాలలోనఁ బులుసు లీలతోఁ గలిసిన
విఱిసి తునుకలగును విరివిగాను
తెలియుమనములోన దివ్యతత్త్వము తేట, వి· 57

ఆ. పికము వనములోన పెల్లుగాఁ బలికిన
భంగి ప్రాజ్ఞజనులపలుకు లుండు
కాకి కూఁతఁబోలు కర్మబంధులకూఁత, వి. 58

ఆ· పుడమి దిరిగి బడయు పుణ్యంబు లెల్లను
గలుగు సాధుజనులఁ గన్నయపుడె
వడిని నీరు నదిని గడుఁ దేటయై యుండు, న. 59

ఆ. పైరు నిడినవానిఫల మదే సఫలంబు
పైరు నిడనివాఁడు ఫలముఁ గనునె
పైరునిడినవాఁడుబహుసౌఖ్యవంతుఁడౌ. వి. 60

ఆ· ప్రజ లెఱుంగ బ్రతుకుఁ పట్టభద్రుఁడు గాఁడు
పైఁ గిరీట ముండు బ్రహ్మ గాఁడు
నోగుఁదెలిసి పలుకు యోగీశ్వరుఁడువాఁడు, వి· 61

ఆ· పృథివిమీఁదఁ బుట్టి ప్రిదులఁగ హంసల
విహరణం బెఱింగి విడువక మదిఁ
దిరుగ నేర్చియుండు ధీమంతుఁ డెప్పుడు, వి. 62

ఆ. బంటువలెనె లేవఁ బండితంమన్యుఁడు
సాధుపండితుండు శాంతుఁ డగును
కుక్క గూయ నేమి గుఱ్ఱమునకు లెక్క, వి. 63

ఆ. బహుళకావ్యములను బరికింపఁగా వచ్చు
బహుళశబ్దచయము పలుకవచ్చు
సహన మొక్కటబ్బ చాలకష్టంబురా? వి. 64

ఆ. బాపలన్న దొడ్డపరువునఁ జూడరు
కానిపనులు సేయ గడిలుకొనరు
కులము లెక్కయేమి గుణమే ప్రధానంబు, వి. 65

ఆ. బ్రాహ్మణులకు సకలభాగ్యంబు లీవచ్చు
గౌరవింపవచ్చు కలయవచ్చు
జ్ఞాన మొసఁగి జనులఁ గడతేర్చునటులైన, వి. 66

క. భువి నరకులమునఁ బుట్టియు
భువినరకులములను బెరిగి భువినరకులముఁ
నవిరళముగ 'ఛీఛీ' యని
శివకులమునఁ దిరుగునతఁడె సిద్ధుఁడు వేమా. 67

ఆ. మతములోన నున్న మతము లన్నియుఁ గోసి
ఘటములోన నున్న ఘనునిఁ దెలిసి
ఘనత నిల్పుచుండు ఘనతత్త్వయోగియా, వి. 68

ఆ. మననవృత్తిలోని మహిమ నెఱుంగుచు
మనసునందె పూజమహిమ గనుచు
మాననకుండువాఁడె మర్మజ్ఞుఁ డగుయోగి, వి. 69

ఆ. మనసు గుప్తపఱచి మాన్యుఁడౌ విబుధుఁడు
తఱచు పలుకకుంట ధర్మమంద్రు
తఱచుమాటచేత దత్త్వంబు? జెడిపోవు, వి. 70

ఆ. మనసునిల్పినట్టి మాన్యులౌ విబుధులె
గరిమ మోక్షపథముఁ గన్నవారు
చెట్టుఁబెట్టి ఫలముఁ జేకొనకుందురా? విశ్వ. 71

ఆ. మరణకాలమందు మది నిల్పు సుజ్ఞాని
పరముఁ బ్రతిభచేతఁ బట్టు విడక
వెనుకఁ గోర్కెలకును విలపించునజ్ఞాని, విశ్వ. 72

ఆ. మర్మవిదుఁడు గాని మర్మంబుఁ గనలేఁడు
కర్మజీవిగాని కానలేఁడు
నీరుచొరక లోఁతునిజములు తెలియునా? వి. 73

ఆ. మాటలాడవచ్చు మనసు దెల్పఁగలేఁడు
తెలుపవచ్చుఁ దన్నుఁ దెలియలేఁడు
సురియఁ బట్టవచ్చు శూరుఁడు గాలేఁడు, వి. 74

ఆ. మాలకన్నియలకు మంచిరూపంబున్న
ముట్టెనే త్రిశంకుపట్టి నాఁడు
కానిపనులు సేయ ఘనులాసపడుదురా? వి. 75

ఆ. ముక్తిఁ గానలేని మూర్ఖజనుల కెల్ల
బట్టబయలుచేసి పరమ పదము
దారిఁజూపుబుధుఁడు దైవంబుగాఁడొకో, వి. 76

ఆ. మున్ను నిన్న గన్నముఖ్యు లెవ్వరో వారి
సన్నుతించి పిదప సంతతమును
జ్ఞానదాతఁ గొల్వ ఘనతచే విబుధుని, విశ్వ. 77

క. మెలఁగి జ్ఞానమయుఁడు మతిమీఱుచుండఁడు
ఉనికి విడఁడు తాను నుపమునొందు
తనువు మఱచి మించి తత్త్వజ్ఞుఁ డుండును, వి. 78

క. మొదటను మతముఁ వదలక
తుద నెవ్వరిమతము నైన దూషింపక తా
బదిలుఁడయి కోర్కెఁ గోరక
ముదమున చరియించు బుధుఁ డెముఖ్యుఁడు వేమా. 79

తే. యాత్రలందలిఫల మొంది యాగములను
సూత్రసమముగఁ జేసియు సూక్ష్మమొంది
పరమ హంసను గీలించి ప్రబలుచుండు
పరము గోరెడు ప్రాజ్ఞుఁ డీధ్ధరను వేమ. 80

ఆ. రాజవరుల కెపుడు రణరంగములచింత
పరమమునుల కెల్లఁ బరముచింత
అల్పనరుల కెల్ల నతివలపై చింత, విశ్వ. 81

ఆ. లోను బదిలపఱచి లోని వికారముల్
తలఁచి మెట్టువారు తెలియువారు
ఆకసమున వేడ్క నరయంగ నుందురు, వి. 82

ఆ. వలయు నన్న రాదు వద్దన్న బోదది
తాను జేసియున్న ధర్మ మనుచు
ఉల్లమందుఁ దలఁపఁ డుత్తమవిబుధుఁడు, వి. 83

ఆ. వాద మాడఁ డెపుడు వరుస నెవ్వరితోడ
జేరరాఁడు తాను జేటుఁ దేడు
జ్ఞానియగుచు బుధుఁడు ఘనతనొందఁగఁజూచు, 84

ఆ. వార్ధియందుఁ బుట్టి వశముగా రావచ్చు
పూర్ణదృష్టియందుఁ బూనవచ్చు
పూని యెఱుకగలిగి బుధుఁడుగాగా లేఁడు, వి. 85

ఆ. విద్య లేనివాఁడు విద్వాంసులకడ
నుండఁగానె పండితుండు గాఁడు
కొలని హంసలకడ కొక్కెర లున్నట్లు, విశ్వ. 86

ఆ. విద్య లేకయున్న వి_త్తము లేకున్న
మూర్ఖుఁడైనఁ దుదకు మూఁగయైన
నిష్టబంధుఁడైన గష్టమే గలుగును, విశ్వ. 87

తే. వినతిసేయును సద్గురు వేఁడుచుండు
మును భ్రమరకీటకన్యాయమున నుండు
వాని నెన్నంగఁదరమె యీవసుధలోన
సాధుసన్మార్గ మదె యగు జగతి వేమ. 88

ఆ. విప్రవరులయందు విబుధులయందును
నీతి నుంచువాఁడె నిర్మలుండు
భ_క్తిగలుగువాఁడె పరమార్థపరుఁడయా, వి. 89

ఆ. విశ్వ మనఁగ నేమొ వివరించి చూచును
విశ్వమైదువిధులు వెలయఁ గనును
విశ్వము మదిలోన వెదకును విబుధుఁడు, వి. 90

తే. విశ్వరూపము మదిలోన వెలయఁ జూచి
హ్రాస్వ మమరఁగ బుద్ధిని నందిపట్టి
స్వస్వరూపము గనుచుండు సజ్జనుండు. విశ్వ. 91

ఆ. వీరుఁ డైన రాదు విబుధులగుణములు
చదువులంద రాదు సటల రాదు
జన్మపాకమున నె సఫలమా నరులకు. విశ్వ. 92

ఆ. వెదకి కాన లేరు వేదాంతవేద్యుండు
నుత్తముండె కాంచు నుర్విమీఁద
కలిగనే నతనిని గానంగ లేరయా. విశ్వ. 93

క. వేడుక మదిలోఁ జూడక
తోడగు నా యెఱుకమీఱి తొక్కుడుపడకా
జాడను మఱచినవాఁడే
వేడుకఁ బరతత్త్వమంది వెలయును వేమా! 94

ఆ. వ్యాధి కలిగనేని వైద్యుని చేతను
మందు దినక కాని మాన దెందుఁ
జెంత దీప మిడక చీకటి వాయునా? విశ్వ. 95

ఆ. స్వానుభూతియందు శాస్త్రవాసనలందు
సంశయంబు లేని సాధనమున
చెలఁగు దీప మట్టు చిత్స్వరూపమునంటు వి. 96

—*—

# అర్థపద్ధతి

---

ఆ. అధముఁ డైనమనుజుఁ డర్థవంతుం డైన
నతనిమాట నడచు నవనిలోన
గజపతింట నున్న గవ్వలు చెల్లవా? విశ్వ. 1

ఆ. అధికభుక్తిచేత మొదటసొమ్ముకు హాని
కుదువసొమ్ముకన్నఁ గొంతహాని
మొదటిపక్షమునను మూలకర్తకు హాని, విశ్వ. 2

ఆ. అప్పులేనివాఁడె యధికసంపన్నుండు
తప్పులేనివారు ధరను లేరు
గొప్పలేనిబుద్ధి కొంచెమై పోవురా, విశ్వ. 3

ఆ. అరయఁ దఱుచు కల్లలాడెడువారింట
వెడల కేల లక్ష్మి విశ్రమించు
నీర మోటికుండ నిలువనిచందాన, విశ్వ. 4

ఆ. అర్థవంతుసొమ్ము నాసింతు రర్థులై
యర్థి కీయ సొమ్ము వ్యర్థమగును
వ్యర్థమైనసొమ్ము వ్యర్థులఁ జేరురా, విశ్వ. 5

ఆ. ఆఁడువారిగన్న నర్థంబుఁ బొడగన్న
సారమైన రుచులచవులఁ గన్న
అయ్యగారికైన నాశలు గలుగవా? విశ్వ.

ఆ. ఆపదందుఁ జూడు మారయ బంధుల
భయము వేళఁ జూడు బంటుగుణము
పేదవడ్డ వెనుకఁ బెండ్లము మతిఁ జూడు, విశ్వ. 7

ఆ. ఆశచేత ధనము నార్జింపఁగా నేల
మట్టిక్రిందఁ బెట్టి మఱువ నేల
ధనము పోవు వెనుక ధర్మం బదేలరా? విశ్వ. 8

ఆ. ఇంటిలోని ధనము నిది నాది యనుచు
మంటిలోన దాఁచు మనుజీవి
కొంచుబోఁడు వెంట గుల్లకాసును రాదు, విశ్వ. 9

ఆ. ఇరుగుపొరుగువారి కెనయుసంపదఁ జూచి
తమకు లేదటన్న ధర్మమేమి
ధర్మమన్నఁ దొల్లి తన్నుక చచ్చిరి. విశ్వ 10

ఆ. ఇహమునందు చాల నిడుమలు పడినను
బడుగు పొందగలఁడె పరమపదవి
పేద కనువుపడునె పృథివిపై భాగ్యంబు, విశ్వ. 11

ఆ. ఇహమున సుఖియింప హేమకారకవిద్య
పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమవిద్య లెల్ల గల్లమూఢులకురా, వి. 12

ఆ. ఇహమునందు సుఖము లింపార లేదట
పరమువందు సుఖముఁ బడయు టెట్లు
ధనము లేక సుఖము తన కెట్లు కలుగురా? వి. 13

ఆ. ఈఁత కన్న లోఁతు నెంచంగఁ బనిలేదు
చావు కన్న గీడు జగతిలేదు
గోఁచిఁపాఁతకంటె గొంచెం బిఁకను లేదు, విశ్వ. 14

ఆ. ఉచితవంతుఁ డైన నుద్యోగపరుఁ డైన
సంపదమరియున్న సమయముననె
పరుల కుపకరించి పాలింపఁ గల్గును, వి. 15

ఆ. ఉన్నయంత మనుజుఁ డుపకారి గాలేక
కన్ను గానఁడంచు ఘనుఁడు పల్కు
దీనుఁ డైనతనకు దిక్కెవ్వ రగుదురు? వి. 16

ఆ. ఉప్పు లేనికూర యొప్పదో రుచులకు
పప్పు లేనితిండి ఫలము లేదు
అప్పు లేనివాఁడె యధికసంపన్నుఁడు, వి. 17

ఆ. ఉర్వివారి కెల్ల నొక్కకంచముఁ బెట్టి
పొత్తుఁ గుడిపి కులము పొలయఁ జేసి
తలను చేయిపెట్టి తగ నమ్మఁజెప్పరో! వి. 18

ఆ. ఋణ మొసంగునాతఁ డిసుఁడగుఁ దొలుదొత్త
నదియు మరల నడుగ యముఁడుగ నగు
అప్పుఁజేసి తీర్ప నఱయనివారికి, విశ్వ. 19

ఆ. ఎంతభూమి దిరిగి యేపాటు పడుచున్న
నంటనీక ప్రాప్తి వెంటఁ దిరుగు
భూమి క్రొత్తదైన భోక్తలు క్రొత్తలా? వి. 20

ఆ. ఎద్దుమొద్దువాని కేలశాస్త్రంబులు
ముద్దునాతి కేల ముసలిమగఁడు
చద్దిమిఁగులనిల్లు సంసార మేలరా? వి. 21

క. ఎన్నాళ్ళిలఁ దా నుండును
ఎన్నాళ్ళిలఁ దాను నేర్చు నెన్నిఁట వెలయుఁ
గొన్నాళ్ళకుఁ దాఁ జనినను
మన్నాఁగద విద్యలెల్ల మహిలో వేమా! 22

ఆ. ఓజమాలునగును ఓడిమాడలచేటు
పాటులేనిమగఁడు కూటిచేటు
పనికిమాలుదాసి బత్తెంబుచేటురా, వి. 23

ఆ. కట్టెపేరు లోలికట్టి చెప్పఁగరాదు
కానరాక యున్న కలిమితనము
జంగమైనవాని జాతి గన్పడదొకో, విశ్వ. 24

ఆ. కడుపునిండఁ దవుడు గంపలోఁ బెట్టిన
జన్నుఁబట్టనీక తన్ను గేదె
వారకాంత లెట్లు వలతురో యూఱక? వి. 25

ఆ. కనకపర్వతమునఁ గాపురం బుండిన
ననిముషేశ్వరునకు నాసపోదు
కనకకుండలములు కర్ణుని నడుగఁడా? వి. 26

ఆ. కనకమృగము భువిని కద్దు లే దనలేక
తరుణి విడిచిపోఁడె దాశరథియు
దైవమైన ధనము దలఁచుచుండెను గాదె, వి. 27

ఆ. కనక మున్నవాఁడు కాముఁడు భీముఁడు
మిగులఁ దేజమంది మెలఁగుచుండు
విత్తహీనుఁడైన వెఱ్ఱులలోనేటు, వి.

ఆ. ఉన్నఘనతఁబట్టి మన్నింతురేగాని
పిన్న పెద్దతనము లెన్నఁబోరు
వాసుదేవు విడిచి వసుదేవు నెంతురా? విశ్వ. 29

ఆ. కనియుఁ గానకుండుఁ గదలింపఁ డానోరు
వినియు వినకయుండు విస్మయంబు
సంపద గలవాని సన్నిపాతక మిది, విశ్వ. 30

ఆ. కన్నెమీఁది యాస కనకంబుపై నాస
లేనివాఁడు పుడమి లేనివాఁడు
కలిగెనే నతండు కానంగ రాఁడయా, విశ్వ. 31

ఆ. కమ్మరీని దుడుకు కార్యవినాశంబు
వడ్లవాని దుడుకు వాలపిడుగు
కాసెవాని దుడుకు కాకుత్స్థబాణంబు, విశ్వ. 32

ఆ. కర్ణుఁడొకఁడెగాని ఘను లెవ్వరును లేరు
దానసీలుఁ డంచు తలంపఁబడెను
తలఁప ధనము కర్ణు దాతఁ జేసెను సుమీ, వి. 33

ఆ. కలిగినమనుజుండు కాముఁడై సోముఁడై
మిగుల తేజమునను మెఱయుచుండు
విత్తహీనుఁడైన నుత్తసన్యాసిరా, విశ్వ. 34

ఆ. కలిగి ధర్మ మీయఁ గాననివారును
కలిగి తినక చాల గ్రాఁగువారు
కలిమి నెచటఁ జూడఁ గానక చెడుదురు, వి. 35

ఆ. కలిమి యున్నవానిఁ గని పట్టి యిచ్చిన
మనువుపొంగుపాలు మఱగినట్లు
లోన నిసిరి కలిమి లొట్టపోయెడునొకో, విశ్వ. 36

ఆ. కలిమి కలిగియుండి కఠినభావముఁ జెంది
తెలియలేరు ప్రజలు తెలివిలేక
కలిమి వెన్నెలగతిఁ గానంగ లేరయా, విశ్వ. 37

ఆ. కలిమి కలిగనేని గాముఁగాఁ జూతురు
లేమిచేతఁ జిక్క లేమ లధిపు
మదనువంటివాని మాలఁగాఁ జూతురు, విశ్వ. 38

ఆ. కలిమి గలుగ సకలకులముల కెక్కువ
కలిమి భోగభాగ్యములకు నెలవు
కలిమి లేనివానికుల మేమి కులమయా? విశ్వ. 39

ఆ. కలిమిఁ జూచి యీయఁ గాయ మిచ్చినయట్లు
సము నకీయ నదియు సరసతనము
పేద కిచ్చుమనువు పెనవేసినట్లురా, విశ్వ. 40

ఆ. కలిమినాఁడు మగనిఁ గామించి చూచును
లేమిఁ జిక్కనాఁడు లేవకుండు
మనినమగనినైన మడియంగఁ జూచును, విశ్వ. 41

ఆ. కాంచనంబుపైనఁ గాంతలపైనను
బమ్మకైనఁ బుట్టు రిమ్మతెగులు
తోయజాక్షువిడుచు దొరయెవ్వఁడును లేఁడు, వి. 42

ఆ. కాంచనంబుమీఁది కాంక్ష మోహ మటంద్రు
విడువలేరు దాని విబుధులైన
కాంక్షలేనివారు కానఁగా రారయా, వి. 43

ఆ. కావవలయు ధనముఁ గాంత నెల్లప్పుడు
కావలేనివాఁడు చావవలయు
కాపులేనిదాని కాపుర మడుగనా? వి. 44

ఆ. కుడువఁ గూడు లేక కూడఁబెట్టఁగ లేక
విడువ ముడువ లేక గడన లేక
నడువ సాగకున్న నడపీనుఁ గందురు, వి. 45

ఆ. కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిఁడి గల్గువాని బానిసకొడుకులు, విశ్వ. 46

ఆ. కులము లేనివాఁడు కలిమిచే వెలయును
కలిమిలేనివాని కులము దిగును
కులముకన్న నెన్నఁ గలిమి ప్రధానంబు, వి. 47

ఆ. కులుకుగుబ్బఁ జూపి గొబ్బున వలపించి
చేతికాసులెల్లఁ జేరఁదీయు
నతనుచేతికత్తు లమరంగఁ గాంతలు, వి. 48

ఆ. కూర లేనితిండి కుక్కతిం డనిపించు
మాఱు లేనితిండి మాలతిండి
ధార లేనితిండి దయ్యాపుతిండిరా, విశ్వ. 49

ఆ. కూలినాలిఁ జేసి గుల్లాముపని చేసి
తెచ్చిపెట్ట నాలు మెచ్చుచుండు
లేమిఁ జిక్కవిభుని వేమాఱు దిట్టును, విశ్వ. 50

ఆ. కోమటి మదిఁ గోరు క్షామమే యెల్లెడ
వైద్యుఁ డోరుల కెపుడు వ్యాధిఁ గోరు
ఊరివాఁడు ధనికుఁ జేరఁగాఁ గోరును, విశ్వ. 51

ఆ. చదువులందుఁ బాడి సౌఖ్యములందును
పదవులందు రాజ్యపదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు గలరొకో, విశ్వ. 52

ఆ. చమురు గల్గుదివ్వె సంతోషముగ వెల్గు
ధనము గలుగువాని తలఁపుఁ జెలఁగు
ధనము లేనివాని తలఁపులు తీరునా, విశ్వ. 53

ఆ. చావు నేఁడొ రేపొ జతపడివచ్చును
పెక్కునాళ్లు కూడఁ బెట్టనేల
అనుచు నాశ లుడిగినంతటివారేరి? విశ్వ. 54

ఆ. జడలు దాల్చుటెల్ల జగము నీ యనుటెల్ల
నొడలు విఱుచునట్టియోగ మెల్ల
ముక్తికాంతఁబట్టి ముద్దాడుకొఱకురా? విశ్వ. 55

ఆ. టంక మదుకకున్నఁ బొంకంబు గారాదు
స్వర్ణభూషణంబు జగమెఱుంగు
భటుఁడు వెంట లేక ప్రభుఁడు శోభించునా, వి. 56

ఆ. డిందుపడినవాని నెందును లెక్కింప
రిందు నందుఁ గాన నెట్టులయిన
మందమతివి గాక మహిమతో నుండుము, వి. 57

ఆ. డొక్క లెండిపోవు డొక్కు తానయ్యును
మమత మానఁగలఁడె మానవుండు
కాన ధనముఁగూర్పఁగడఁగుము జ్ఞానివై, వి. 58

ఆ. తమకు బంధు వనుచు తాన తోడుకవచ్చి
కలిమిఁ గలయఁ జూచి కాంక్షపడుచు
దక్షిణల నొసంగి తరుణి నీయఁగఁజూచు, వి. 59

ఆ. తఱుచు కల్లలాడు ధరణీశు లిండ్లలో
వేళవేళ లక్ష్మి వెడలిపోవు
నోటికుండలోన నుండునా నీరంబు? విశ్వ. 60

ఆ. తరుణి సుతులు ధనము ధాన్యముల్ సంపద
లెంతచుట్టుకొనిన నంతచేటు
పసిరికాయ పురుగుపద్ధతి గానరో, విశ్వ. 61

ఆ. తలను బాగపైని దగుపచ్చడము బొజ్జ
చెవులపోగు లరసి చేరు నర్థి
శుద్ధపశువు లనుచు బుద్ధిలో నరయక, విశ్వ. 62

ఆ. తల్లిబిడ్డలకును దగవు పుట్టించెడు
ధనము సుఖముఁ గూర్చు దని వచింత్రు
కాని గడన లేక గడచుట యెట్లురా? వి. 63

ఆ. తళుకు బెళుకుఁ జూచి ధరలోనిజను లెల్ల
కద్దు లే దటంద్రు ఘనతగాను
ఇదిగొ యదిగొ యనుచు నిఁక నెక్కడందురు, వి. 64

ఆ. తవిటి కరయఁ బోవఁ దండులంబుల గంప
శ్వాన మాశ్రయించు సామ్యముగను
వైశ్యవరునిసొమ్ము వసుధ నీచుల కబ్బు, వి. 65

ఆ. తాను గుడువ లేఁడు తగ వేది యాప్తులఁ
జేరనీయఁ డట్టి చెనఁటి పసువు
చేనిలోన బొమ్మఁ జేసి కట్టినయట్లు, విశ్వ. 66

ఆ. తాము దిరుగుభూమి ధూమడాంబర మైనఁ
బరగు దేశమునకు జరుగవలయుఁ
గొలన బెండిపోవఁ గొక్కెరలుండునా? వి. 67

ఆ. తిరిపెగాఁడయినను దిరిపె మెత్తినయట్టి
తిరిపెమందె తాను దిరిపె మిడిన
తిరిపెము తిరిపెమున దిగఁబడిపోవురా. వి. 68

ఆ. తీపికెల్లఁ దీపి తెలియంగఁ బ్రాణంబు
ప్రాణవితతికన్నఁ బసిఁడి తీపి
పసిఁడికంటె మిగులఁ బడఁతిమాటలు తీపి, వి. 69

ఆ. తెవులుబడ్డవాఁడు దేవతాభక్తుండు
ఈఁటెలేనివాఁడు పోటుబంటు
కాసులేనివాఁడు కడుబ్రహ్మచారియౌ, వి. 70

ఆ. తోఁటకూరకైన దొగ్గలికైనను
తవిటికుడుముకైనఁ దవిటికైనఁ
గావ్యములను జెప్పు ఘను లెల్ల ధనపరుల్, వి. 71

ఆ. దశగలారి నెల్ల తమబంధువు లటంద్రు
దశయు లేమి నెంత్రు తక్కువగను
దశయనంగను ధనదశయొప్పు నొక్కటే, వి. 72

ఆ. దశయనంగ మెంచు ధనముంటయే యంద్రు
కూడు నిద్రలేక కుందుటెకద
రాఁగ నుండఁబోవ బాగుగా నేడ్పించు, వి. 73

ఆ. దానములను జేయ ధర చేతులాడక
బహుధనంబుఁ గూర్చి పాతిపెట్టి
తుదను దండుగనిడి మొదలు చెడునరుఁడు, వి. 74

ఆ. దినము మూఁడుమార్లు తిని నిదురించుచు
సొగసుచనులవారి సొంపుతోడఁ
జేరుచుండి ధనముఁ జెడుపకు మెప్పుడు, వి. 75

తే. దేశదేశమ్ముఁ దిరుగుట తిండికొఱకె
పూని వేషము వేయుట పొట్టకొఱకె
మనసునందునె గుఱిఁగాంచి మమతవిడరు, వి. 76

ఆ. దేశవేషములను తేటసేయఁగ దేవుఁ
డాత్మలోన నుండు నణఁగి పెనఁగి
వేస మరసి చూడ గ్రాసంబు కొఱకయా, వి. 77

ఆ. దోసకారియైన దూపరివాఁడైన
బగతుఁడైన వేదబాహ్యుఁడైన
ధనికు నెల్లవారు తనియింపుచుందురు, విశ్వ. 78

ఆ. ద్రోహబుద్ధినైన దొంగతికమునైన
సటలనైన సాహసములనైన
సంపదధికువలన సాధింపఁదగు టొప్పు, విశ్వ. 79

ఆ. ధనము లేకయున్న ధైర్యంబు చిక్కదు
ధైర్య మొదవ దేని ధన మొదవదు
ధనము ధైర్య మరయఁ దగుభూమి నరులకు, వి. 80

ఆ. ధనము లేమి గుణము తక్కువపడవచ్చు
ధనము లేమి కీర్తి తలఁగిపోవు
ధనము లేమి శుచిని తగఁ బుట్టనీయదు, వి. 81

ఆ. ధనము లేనిపేద తండ్రిగర్భంబున
భాగ్యపురుషుఁ డొకఁడు పరఁగఁబుట్టి
బహుళధనముఁగూర్చుభద్రంబులోనఁగూర్చు,వి. 82

ఆ. ధనము లేమి యనుట దావానలంబగు
తన్నుఁ జెఱుచు మీఁది దాపుఁ జెఱుచు
ధనము లేమి మదిని తలఁపఁగా పాపంబు, వి.

ఆ. ధనము లేమి సుతులు తప్పుల నిడుదురు
ధనము లేమి పత్నిఁ దాఁకరాదు
ధనము లే మెవరికి తాళిక నీయదు, విశ్వ. 84

క. ధనమూ మూలము జగముకు
ధనమూ మూలంబు సకలధర్మంబునకున్
గుణములు మూలము సిరులకు
మనమూ మూలంబు ముక్తిమహిమకు వేమా! 85

ఆ. నక్కవినయములను నయగారములఁ బల్కి
కడకు ధనముఁ గూర్పఁ గడఁగుచుండ్రు
కుక్కబోనువాతఁ గూడు చల్లినరీతి, విశ్వ. 86

ఆ. నారాయ ణనవచ్చు నమశివ యనవచ్చు
మేలువారిఁజూచి మెచ్చవచ్చు
కొంగుకాసు విడిచి గొబ్బున నీరాదు, విశ్వ. 87

ఆ. పరఁగ లేమిచేత బంధువు ల్పగవారు
పరఁగ లేమిచేతఁ బరము తప్పు
పరఁగ లేమిచేతఁ బరపతియును దప్పు, విశ్వ.

ఆ. పాగ పచ్చడంబు పైకిఁ గూసంబును
పోగు లుంగరములు బొజ్జకడుపుఁ
గలిగినట్టివానిఁ గందురు చుట్టాలు, విశ్వ. 89

ఆ. పాపపుణ్యములను పసిగా పెఱుంగునా
ధరను బరమయోగి యెఱుఁగుఁగాక
పసిఁడిపొందిక గని బాగుగాఁ గూర్పుము, వి. 90

ఆ. పాలసాగరమునఁ బవ్వళించినహరి
గొల్లపల్లెపాలు గోరనేల
నెదుటివారిద్రవ్య మెల్లవారికిఁ దీపి, విశ్వ. 91

ఆ. పుత్త్రడిగలవాని పుండుబాధయుఁ గూడ
వసుధలోనఁ జాలవార్తకెక్కు
పేదవానియింట పెండ్లైన నెఱుఁగ. వి. 92

ఆ. పూర్వజన్మమందు పుణ్యంబు సేయని
పాపి తా ధనంబుఁ బడయ లేఁడు
విత్త మఱచి కోయ వెదకినచందంబు, వి. 93

ఆ. పూసపోగుఁ బసిడిపుట్టంబు విద్యయుఁ
గాయపుష్టి చాలఁగలిగెనేని
కానికులజు నైన ఘనుఁ డని రమ్మంద్రుఁ వి. 94

ఆ. పేదవానిబాధ పెనుభూత మైయుండు
జాడలేదు బాధఁ జూడ వశమె
కలుగువానిబాధ కనులఁ జూడఁగ లేమి
కేమిచేయవచ్చు నింక వేమ! 95

ఆ. ప్రాప్తిగల్గుచోట ఫల మిచ్చుదైవంబు
ప్రాప్తిలేనిచోట ఫలము లేదు
ప్రాప్తిలేక పసిఁడి పరమాత్ముఁ డిచ్చునా? వి. 96

ఆ. మగని కలిమిబలిమి మగువకును బలంబు
కలిమి లేనిమగఁడు కాసుఁగాఁడు
పనికిరానిమగని పాటించి చూడరు, వి. 97

ఆ. లేమిగల్గువాఁ డిఁకేమేమి చేసిన
కలిసిరాదు ఫలము కాసుగూడ
కలిమి గల్గుజోటఁ దులతూఁగుచుండును, వి. 98

—*—

భారతమాతా ప్రెస్, 89, అండర్ సన్ వీధి, మద్రాసు_1.

# वेमनपद्य - संस्कृतानुवादः

# VEMANAPADYAMULU

IN

SANSKRIT SLOKAS

BY

S. N. SRIRAMA DESIKAN, SIROMANI

WITH A FOREWORD BY

SRI M. ANANTHASAYANAM AYYANGAR

*Governor of Bihar*

 1962 [Rs 1-75.